# శ్రీనివాస కల్యాణము

చిత్రకారుడు

టి. సాయికృష్ణ



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

# శ్రీనివాస కల్యాణము


చిత్రకారుడు

**టి. సాయికృష్ణ**






తిరుమల తిరుపతి దేవస్థానములు

తిరుపతి

# SRINIVASA KALYANAM

*Illustrations by*

**T. SAI KRISHNA**

T.T.D. Religious Publications Series No.242



*First Edition* : 2001
*Reprint* : 2003
*Copies* : 2000

*Published by*

**Ajeya Kallam,** IAS
Executive Officer,
Tirumala Tirupati Devasthanams,
Tirupati - 517 507.

*Printed at*

**Students Offset Printers,**
553, Balaji Colony,
Tirupati.
Ph.No.2229253.

# ముందుమాట

వేంకటాద్రి సమం స్థానం బ్రహ్మాండే నాస్తి కించన,
వేంకటేశ సమోదేవో న భూతో న భవిష్యతి.

ఈ బ్రహ్మాండంలో వేంకటాద్రితో సమానమైన స్థానం ఇంకొకటి లేదు. వేంకటేశ్వరునితో సమానమైన దేవుడు లేడు; ఇకముందు ఉండడు.

ప్రపంచంలో ఎక్కడా మరే దేవాలయానికీ లేని ప్రాశస్త్యం శ్రీ వేంకటాద్రికి, వెంకటేశ్వరునికి ఉందన్న సత్యం అందరికీ తెలిసిందే. కృతయుగంలో నరసింహమూర్తి, త్రేతాయుగంలో శ్రీరామచంద్రుడు, ద్వాపరయుగంలో శ్రీకృష్ణుడు, కలియుగంలో వేంకటేశ్వరుడు ప్రత్యక్ష దైవాలు. కలియుగంలో భక్త సంరక్షణార్థం శ్రీ మహావిష్ణువు వైకుంఠాన్ని విడిచి తిరుమలలో నెలవుచేసుకొన్నాడు. అందుకే తిరుమలకు కలియుగ వైకుంఠమని సార్థకమైంది.

శ్రీనివాసుడు వేంకటాచల నివాసియై అకాశరాజ పుత్రి అయిన పద్మావతి దేవిని పరిణయమాడిన పవిత్రగాథ సచిత్ర వ్యాఖ్యాన సహితంగా ప్రచురిస్తున్నాం. చిత్రగ్రంథానికి వ్యాఖ్య ఉన్నట్లయితే పామరులకు సైతం సుబోధకంగా ఉండగలదన్న నమ్మికతో దేవస్థానం వేంకటేశ్వర కల్యాణం ప్రచురిస్తోంది. ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ టి.సాయికృష్ణగారి చిత్రలేఖనం ద్వారా వెలువడుతున్న ఈ 'శ్రీనివాస కల్యాణం' అందరినీ ఆకట్టుకోగలదని భావిస్తున్నాము. శ్రీ కామిశెట్టి శ్రీనివాసులుగారు ఈ చిత్రాలకు వ్యాఖ్యానాన్ని సంతరించారు.

కార్యనిర్వహణాధికారి,
తిరుమల తిరుపతి దేవస్థానములు.

అది పరమపావనమైన గంగానదీ తీరం. కశ్యప ప్రజాపతి పర్యవేక్షణలో సకల మునిగణాలు గుమిగూడి యాగాన్ని ప్రారంభించారు. ఇంతలో వీణాముని నారదులవారు ప్రవేశించారు. ఆ కలహ భోజునితో కళ్యాణ గాధకు అంకురార్పణం జరుగుతుంది కాబోలు. 'ఈ యాగప్రయోజనం ఏమిటి? యజ్ఞఫలాన్ని ఏ వేల్పు స్వీకరిస్తాడు?' అని వారు మహర్షులను అడుగుతారు.

నారదుని ప్రశ్నలకు సమాధానం తోచని ఋషులు భృగుమహర్షిని ఆశ్రయించారు. యాగఫలం పొందడానికి త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులలో ఎవరు అర్హులో నిర్ణయించవలసిందని ప్రార్థించారు.

భృగువు సత్యలోకం చేరాడు. ప్రణయ లోకంలో విహరిస్తున్న సరస్వతీ చతుర్ముఖులు మునిరాకను గమనింపలేదు. వాణీవీణాలోలుడైన బ్రహ్మ పూజకు అర్హుడుకాడని నిందిస్తూముని కైలాసానికి కదిలాడు.

అర్ధాంగి యగు అద్రి తనయతో ఆనందముననున్న ఆ పరమేశ్వరుడు మహర్షిని గమనించి మన్నింప లేదు. పార్వతి మాత్రము పతి దృష్టిని మహర్షిపై మరలించినది.

పరమేశ్వరుని నిర్లక్ష్యానికి గురి అయిన భృగువు ఉగ్రుడై 'శివలింగానికే పూజలు పొమ్మ'ని శపించాడు. ఆగ్రహోదగ్రుడైన రుద్రుని పరాశక్తి నివారించింది.

పాదనేత్రుడు పాలకడలిలో అడుగు మోపాడు. శ్రీకాంతాసక్తుడైన వైకుంఠవాసుడు శేష పాన్పుపై పవళించి వున్నాడు. భృగుమహర్షికి అరికాలి మంట నెత్తికెక్కినది. ఆదినారాయణుని వక్షః స్థలం మీద ముని తన పాదాన్ని మోపాడు.

'అయ్యో! నా కఠినమైన ఉరము సోకి మీ మృదువైన పాదం కంది పోయింది కదా!' అంటూ ఆ జగన్నాటకసూత్రధారి భృగువు పాదంలోని నేత్రాన్ని చిదిమివేశాడు. ముని అహంకారం అణగిపోయింది. శుద్ధ సత్త్వమూర్తి అయిన మహావిష్ణువే యజ్ఞపూజకు అర్హుడని నిర్ణయించాడు. మునికులమంతా యజ్ఞఫలాన్ని మాధవునకే సమర్పించినది.

‘మీ వక్షస్థలం నాకు నిత్యనివాసం. నా శయ్యాసౌభాగ్యాలకు నిలయము. లక్ష్మీ నిలయాన్ని కాలదన్నిన మునిని గౌరవించారు. ఆ జడదారి అపచారానికి శపింపక ఉపచారాలు చేశారు. ఇంతకంటె అవమానమేమున్నది ఇల్లాలికి. భార్య పరాభవాన్నే భరించిన భర్తతో నాకేం పని’ అంటూ మహాలక్ష్మి వైకుంఠాన్ని వదలి వెళ్ళింది.

అది మహాకల్పం. సృష్టి అంతా జలమయమైంది. హిరణ్యాక్షుడు వరగర్వంతో భూమిని చాపచుట్టగ చేసి సముద్రంలో ముంచివేశాడు. భూదేవి హాహాకారాలు విన్న శ్రీహరి ఆదివరాహమూర్తి అయి ఆ రాక్షసుని సంహరించి భూమిని ఉద్ధరిస్తాడు.

తన ప్రణయాంకంలో భూసతిని నిలుపుకొని లోకరక్షణార్థం శంఖ చక్రాలు ధరించి ఆ శ్వేత వరాహమూర్తి వెలసిన చోటు వరాహక్షేత్రంగ ప్రసిద్ధి పొందింది. బ్రహ్మాది దేవతలు పుష్పవృష్టి కురిపించారు. నాటినుండి శ్వేతవరాహకల్పం ప్రారంభమయింది.

లక్ష్మి అట్లా అలిగి వైకుంఠం వదలి వెళ్ళడంతో ఒంటరివాడైన వైకుంఠవాసుడు వేంకటాచల శిఖరాలు చేరాడు. వరాహపుష్కరిణి సమీపంలోని చింతచెట్టు క్రింద ఒక పుట్టలో నివసించ సాగాడు.

వల్మీకంలో కాపురమున్న నారాయణుని సేవించుకోడానికి బ్రహ్మ, మహేశ్వరులు - ఆవు, దూడగ అవతరించారు.

ఆదిలక్ష్మి కి ఈ విషయాన్ని సూర్య భగవానుడు వివరించాడు. గొల్లభామ వేషంతో వెళ్ళి ఆ ఆవుదూడలను చోళరాజుకు విక్రయించమని ప్రార్థించాడు.

చోళభూపతి గొల్లెత తెచ్చిన ఆవుదూడలను చూసి ముచ్చటపడి స్వీకరించి తన గోశాలకు తరలించాడు. ప్రతి నిత్యం గోవు తన క్షీరంతో పుట్టలో చేరిన స్వామిని తృప్తిపరచేది.

కామధేనువులాంటి గోవు ఇంట పాలివ్వకపోవడంతో చోళరాణి యాదవుని అనుమానించి తీవ్రంగ దండిస్తుంది.

మందవిడిచి ఒంటరిగ గోవు వెళ్లడం చూసిన యాదవుడు వెన్నంటి పోతాడు: అది పుట్టమీద పాలను వర్షించడం చెట్టుచాటు నుండి గమనించాడు.

పాలను పుట్టపాలు చేస్తున్న ఆవుపై ఆగ్రహించి యాదవుడు దానిని కొట్టడానికి చేతి బడితెను పైకెత్తాడు. గోవును కాపాడడానికి పుట్ట వెలువడిన శ్రీనివాసుడు గోపాలుని కర్ర దెబ్బకు ఆహుతయ్యాడు.

శ్రీనివాసుని తలలో రక్తం చిందీ గోవుపై పడ్డది. యాదవుడు నేలకూలాడు.

గోపాలుడు మరణించాడు. రక్తపు మరకలతో తడిసిన ఆవు చోళనగరం చేరింది. రాజు ఆవుపై రక్తాన్ని గమనించి అమంగళాన్ని శంకించాడు. ఆవు ముందుకు దారితీసింది. చోళుడు గోవువెంట నడిచాడు.

ఆవు పుట్ట సమీపంలో నిలిచింది. గొల్లవాని శవాన్ని చూసి రాజు నిశ్చేష్టుడయ్యాడు. శ్రీనివాసుడు చోళరాజును 'పిశాచము కమ్మ'ని శపించాడు. దాసుని తప్పునకు రాజునకు దండన. 'నిరపరాధిని నన్ను మన్నింపవే' అని చోళుడు శ్రీనివాసుని ప్రార్థించాడు. 'పద్మావతిని నేను పరిణయమాడే వేళ ఆకాశరాజు ఇచ్చిన కిరీటాన్ని ధరించిన మరుక్షణమే నీకు శాపవిమోచనం' పొమ్మన్నాడు శ్రీనివాసుడు.

వరాహస్వామి అనుమతితో శ్రీనివాసుదు పుష్కరిణి ఒడ్డున స్థిర నివాసం ఏర్పరచుకొన్నాడు. వరాహ క్షేత్రమయిన తిరుమలలో తనకు స్థితిగతులను కల్పించిన భూవరాహ స్వామికే తొలి పూజానైవేద్యాలు జరుగవలసిందిగ శ్రీనివాసుదు కట్టడి చేశాడు.

వరాహమూర్తిని సేవించే వకుళమాలిక శ్రీనివాసుని లాలించసాగింది. వకుళ .పూర్వజన్మలో యశోద. తనచేతుల మీదుగ శ్రీకృష్ణునకు కల్యాణతిలకం దిద్దలేకపోతినే యని ఆ తల్లి ఆరాటపడింది. ఆ కోరిక తీరకే యశోద వకుళ అయింది. కృష్ణయ్య శ్రీనివాసుడయ్యాడు. వకుళ కనులలో పారాడేది కృష్ణుడే.

ఆరోజుల్లో ఆకాశరాజు తొండమండలాన్ని పాలించేవాడు. ఇతని తమ్ముడే తొండమానుడు. సంతానార్థి అయిన ఆకాశరాజు యాగాన్ని సంకల్పించి యజ్ఞవాటికను దున్నసాగాడు. ఆశ్చర్యం. నాగేటి చాలు నోకి భూమినుండి వెలువడిన పద్మంలో ఒక అందాల పసిపాప బోసినవ్వు లొలకబోస్తున్నది.

ఆకాశరాజు ఆనందానికి అవధుల్లేవు. ఆ పసిపాపను ధర్మపత్ని ధరణీదేవి చేతుల్లో ఉంచాడు. ధరణీదేవి కళ్ళలో ఆనందబాష్పాలు వక్షోజాలలో పాలధారలు పెల్లుబికాయి. ఇంతలో ఆకాశవాణి వినిపించింది. 'ఆకాశరాజా! ఈమె కారణజన్మురాలు. ఈ కన్యక వల్ల మీకు లోకోత్తర శుభములు సమకూడగలవు'. పద్మంలో వెలసిన పాపకు 'పద్మావతి' అని నామకరణం చేసి ఆ రాజదంపతులు అల్లారుముద్దుగపెంచసాగారు.

యౌవనవతి అయిన పద్మావతి ఒకనాడు చెలికత్తెలతో వనవిహారం చేస్తుండగ అక్కడికి ఒక ముని వచ్చాడు. పద్మావతి హస్తరేఖలు పరిశీలించి 'నీవు మహావిష్ణువునే చేపట్టగల భాగ్యశాలివి' అన్నాడు. ఆ త్రికాలవేది ఎవరో కాదు నారదులవారే.

వేటకు వెళ్ళిన శ్రీనివాసునికి మదపుటేనుగుఎదురైంది. ధనుర్బాణాలు ధరించి అశ్వారూఢుడైన శ్రీనివాసుడు దానిని వెన్నంటి తరుమసాగాడు. ఆ మదగజం గజగమనలు విహరించే ఉద్యానవనం చేరింది. ఆ ఏనుగును చూసి పద్మావతి, చెలికత్తెలు భయభ్రాంతులయ్యారు.

అక్కడ శ్రీనివాసుని చూడగనే ఏనుగు అదృశ్యమై పోయింది. బెదరుతీరిన ముద్దుగుమ్మలు ఆశ్చర్యస్వరూపుడైన శ్రీనివాసుని చుట్టు చేరి ప్రశ్నించ సాగారు. పద్మావతి ఆ నవయువకుని ఓరగంట చూడసాగింది.

శ్రీనివాసుడు పద్మావతి వైపు తిరిగి తన పేరు, పెంపు, తెలిపి ఆమె పుట్టు పూర్వోత్తరాలను తెలపమన్నాడు.

'పద్మావతి ఆకాశరాజు పుత్రిక' అని చెలికత్తెలు తెలిపారు. శ్రీనివాసుని మనసు వశం తప్పినది. 'మీ చెలిని నేను ప్రేమించాను. పెళ్ళి చేసుకొంటా'నని పద్మావతిని సమీపించాడు. చెలికత్తెలు అతని దుడుకుతనాన్ని వారించి రాళ్ళందుకొన్నారు. ఆడవాళ్ళ దెబ్బల రుచి తెలిసిన అవతారపురుషుడు మర్యాదగ శేషాద్రికి వెనుతిరిగాడు.

శ్రీనివాసుని మనసు పద్మావతీ అధీనమైనది. వకుళమాలిక ఆప్యాయంగ అమర్చిన భక్ష్య భోజ్యాలను ముట్టలేదు. పరాధీనుడైన తనయుని చూసి తల్లిమనసు తల్లడిల్లిపోయింది. 'నీ మనసులో బాధేమిటో చెప్పవయ్యా శ్రీనివాస' అన్నది వకుళ. శ్రీనివాసుడు పద్మావతిపై ప్రణయాన్ని తెలుపుతూ ఆమె పూర్వజన్మ వృత్తాంతాన్ని కూడ వినిపించసాగాడు.

అపర లక్ష్మీదేవి అయిన వేదవతి మునిఆశ్రమంలో ఉండగా కామాంధుడైన రావణుడు ఆమెను వాంఛించి బలాత్కరించబోయాడు. వేదవతిలో కోపం భగ్గుమన్నది. 'నీచుడా! నీ చావుకు నేనే కారణమౌతా' నని శపించింది.

రాక్షస స్పర్శకు నిందించుకొంటూ వేదవతి అగ్నిప్రవేశం చేస్తుంది. అగ్నిదేవుడు ఆమెను సురక్షితంగా తన భార్య అయిన స్వాహాదేవికి అప్పగిస్తాడు.

వనవాసం చేస్తున్న సమయంలో రామలక్ష్మణులు లేనపుడు సీతమ్మను అపహరించుకొని పోవడానికి రావణాసురుడు పంచవటికి వస్తాడు. ఆ దశకంఠుడు లంకకు ఎత్తుకొని పోయినది అసలు సీతను కాదు ఈ వేదవతినే.

సీతమ్మగా భావించి రావణుడు వేదవతిని లంక చేర్చగా రాముని అర్ధాంగి సీత అగ్నిహోత్రుని ఇల్లు చేరింది.

రావణుని ఇంట ఉన్న వేదవతిని సీత అనుకొన్న రాముడు ఆమెను స్వీకరించక నిరాకరిస్తాడు. వేదవతి అగ్ని ప్రవేశం చేస్తుంది. అగ్నిదేవుడు సీతతో బాటు వేదవతిని కూడ రామునికి అప్పగిస్తాడు.

వేదవతివైపు ప్రశ్నార్థకంగ చూస్తున్న రామునికి సీతమ్మ చెప్తున్నది. 'నాకు మారుగ ఇంత కాలం రాక్షసుల బారిపడి అష్టకష్టాలకు ఓర్చిన ఈ వేద వతిని స్వీకరించండి'. 'నేను ఏకపత్నీ వ్రతుడనని నీకు తెలియదా జాన కీ! ఈ జన్మలో ఇది కాని పని. మరో జన్మలో ఈ వేదవతి ఆకాశరాజు ఇంట పద్మావతిగ అవతరిస్తుంది. నేను శ్రీనివాసుడనై ఆమెను చేపట్టా న'ని సీతకు వాగ్దానం చేస్తాడు శ్రీరాముడు.

ఇది విన్న వకుళమాలిక పద్మావతిని పరిణయమాడనిదే శ్రీనివాసునకు సుఖము లేదని తెలిసి, ఆకాశరాజు ధరణీ దేవులతో పెండ్లి రాయబారము చేయ తనే బయల్దేరినది. మార్గమధ్యమున ఆమె శివాలయము నుండి వచ్చు పద్మావతి చెలులను కని ఆకాశరాజు తనయను శ్రీనివాసునిపై విరహమున వేగుచున్నట్లు తెలుసుకొనినది. వారి వెంట అంతఃపురమున కేగినది.

పద్మావతి విరహజ్వరంతో పాన్పు పట్టింది. తన కూతురు శ్రీనివాసుని పై మరులుకొన్నదనీ విన్నారు. బృహస్పతితో సంప్రదించి శ్రీనివాసునితో సంబంధం శ్రేయస్కరమని కల్యాణ గడియలకు ఎదురు చూడసాగారు.

శ్రీనివాసునికి తొందర ఎక్కువ. ఎరుకలసాని వేషంతో పద్మావతి నగరు ప్రవేశిస్తాడు. రాజవీథుల్లో తిరుగుతున్న ఈ కపట సాముద్రిక వేత్తను చెలికత్తెలు రాణీవాసానికి రమ్మని పిలిచారు.

ఎరుకలసానికి శ్రీమద్గాంభీర్యం ఎక్కువ. రాణిగారి పిలుపు లేనిదే అంతః పురానికి రానంటుంది.

తన కుమార్తె భవిష్యత్తే సర్వస్వంగ భావించిన ధరణీదేవి ఆ ఎరుకలసానిని స్వయంగ వెళ్ళి ఆహ్వానిస్తుంది.

పద్మావతి ఛేతి సొగసు రేఖలను శేషాచల ఎరుకలసాని చూస్తూ 'ఇది ప్రేమకు సంబంధించిన జబ్బు. కొండలదొర శ్రీనివాసుని కిచ్చి పెళ్లి చేస్తే అన్నీ కుదురుకుంటాయి. త్వరలో ఆ కోనేటి రాయడు తన తల్లిని పెళ్లి రాయబారానికి పంపుతాడ'ని చెప్పింది.

ఎఱుకలసాని వెడలిపోయిన అనంతరము రాణి పరిచారికలతో కూడియుండ వకుళమాలిక రాణి వద్దకు వచ్చి తాను శ్రీనివాసుని వద్ద నుండి వచ్చినట్లు తెల్పి ఆయనను పద్మావతి నీయవలసినదిగా అర్థించినది.

బృహస్పతి మాట, ఎరుకతె జోస్యం, వకుళ రాయబారం అన్నీ విన్న ఆకాశరాజు పద్మావతీ పరిణయానికి ముహూర్తం నిర్ణయించవలసిందిగా దైవజ్ఞులను కోరాడు.

బృహస్పతి మాట, ఎరుకలి జోస్యం, వకుళ రాయబారం అన్నీ విన్న ఆకాశరాజు పద్మావతీ పరిణయానికి ముహూర్తం నిర్ణయించవలసిందిగా దైవజ్ఞులను కోరాడు.

పద్మావతి శ్రీనివాసులకు వివాహము చేయు తన సంకల్పమును మహారాజు సభలో వెల్లడించి ఆ క్షణముననే శ్రీనివాసునకు పంపుటకు రాజమందిరమునకు వచ్చి పద్మావతిని వివాహమాడవలసినదిగా కోరుచూ ఆహ్వాన పత్రికను సిద్ధము చేసిరి.

ఆకాశరాజు సందేశము కొనిపోవుటకు శుకమహర్షిని నర్థింపఆయన వకుళమాలికతో సహా వేంకటగిరి కేగి శ్రీనివాసుని దర్శించి పత్రిక నొసగ ప్రీతుడైన శ్రీనివాసుడు మహర్షిద్వారా కంఠమాలను బహుమతిగా పద్మావతికి పంపినాడు.

శ్రీనివాసుడు పద్మావతిని పరిణయమాడడానికి శివబ్రహ్మాది దేవతల ఆమోదాన్ని పొందాడు.

కల్యాణానికి కావలసిన పైకాన్ని అప్పుగ సమకూర్చమని శ్రీనివాసుడు కుబేరుని ఆదేశించాడు. పెళ్లికోసం చేసిన అప్పును కలియుగాంతం వరకు చెల్లించక తప్పదు వడ్డీకాసులవానికి.

వెడలెను వేంకటదైవ శిఖామణి పెళ్లికొమరుడై గరుడారూఢుడై; సకల సురులు-మునివరులు కొలువగా కదిలెను శ్రీనివాసుడు.

ఆకాశరాజు సకల రాజ మర్యాదలతో శ్రీనివాసవరుని ఆహ్వానించాడు. కొత్తపెళ్లి కొడుకును భద్రగజముపైన ఊరేగించాడు. శ్రీనివాసచంద్రుని దివ్యసౌందర్యాన్ని నగర కాంతలు నయన చకోరాలతో ఆస్వాదించ సాగారు.

కల్యాణవేదికమీద పద్మావతీ శ్రీనివాసులు. పద్మావతి పాణిద్వయాన్ని శ్రీనివాసుని చేతులలో ఉంచి ఆకాశరాజు తృప్తిగనిట్టూర్చాడు. మెరుపు మేఘము కూడి మెరసినట్లయినది. ముక్కోటి దేవతలు ఆశీర్వదించారు. ముత్తైదువల మంగళ గీతాలు వినిపిస్తున్నాయి.

కమలారమణికి కమలాక్షునకును
మమతల జయజయ మంగళము.

అది లోకకల్యాణం కోసం అవతరించిన శ్రీనివాసుని కల్యాణగాథ.

శ్రియఃకాంతాయ కల్యాణనిధయే నిధయేర్థినామ్
శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్...

